శ్రీకనకదుర్గాంబికా స్తుతిచూర్ణిక. ౧

ఓంఐం శ్రీమత్స కలనిర్మాణ కార్యాకార్యగర్త ప్రవీణతేజోవిలసిత జేగీయమాన పరంజ్యోత్యాత్మీయ కపీతాభాస్వస్త్వణూపమం ఓం హ్రీం సకలతిమిరాంధకారాపహం .........................

ఓంక్లీం శ్రీమత్సకల చరాచర సృష్టిస్థితిలయా హేతుభూత కార్యా కరణక్రియాత్రి మూర్త్యాత్మకత్రిశక్తి సంయుత ఆదిశక్తీయ మహావిద్యానువర్తిత హరిధ్వజ గదాకుంతతో మరపరశుపట్ట సప్రి సకరవాలము సలముద్గరభిండివాల చక్రశూలత్రిశూలాద్యనేక దివ్యాయుధధారిణీం ఓంహ్రీం సకలలోక విహారిణిం. .........

ఓంసౌం వజ్రవైడూర్య నీలగోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య మౌక్తికప్రవాళ గోపురాలయ స్తంభగంభీర మంటప నివశీకృత మకరతోరణ మహోన్నతీం. ఓంహ్రూంసకలమణి మయాన్విత రత్న సింహాసనోన్నతీం ........................................

ఓంహ్ర్యాం పసపుకుంకుమ సాంబ్రాణి కర్పూరగుగ్గిల ధూపదీపనైవేద్య వడపప్పుపానక మధురసాన్నసూప శాకాద్దధిఘృతలేహ్య భక్ష్యపానీయ తాంబూల శకటాసుఘుట బహుప్రభవైభవోత్సవోన్నద్య మహిషాజ కుక్కుట నారికేళ జంబీర ఫలవిచ్ఛిన్నాను మోదితాగ మోక్ష ప్రమోదితం ఓంహ్రైంసకల భక్తానుమోదితం......

ఓంక్లోం శ్రీమత్సకల నిగమానుసార ప్రవాదియధ్యాత్మని ధ్యానువర్తితరజిత కంచుకహేమచేలాన్విత నిత్యోత్సవ నిత్యమంగళనిర్వే ర నిత్యానంద నిగమోన్నత నిత్యశ్రీప్రస్ఫు రస్ఫురజ్వాలా ఖీలక్ల కీలానలమహాట్టహాసహాసహాసవశవశ హ్రీంహ్రైం క్లీంక్లీం క్షేం రభైరభై ఖణంఖణపేం ఖణపేం ఖణస్ఫుటస్ఫుట ప

# శ్రీకనకదుర్గాంబికా స్తుతిచూర్ణిక.

ప్రస్ఫుట ఘగద్ఘగపటుత్పటు సహాసహా కురుకురు కుర్విత మహా వీరశా క్త్రియ షట్ఛక్తి సంయుత పంచవన్నియకీరాకృత సర్వ ప్రపంచక సంచలిత మాయాస్ఫంజి విదళనవిదళిత మోహన మోహనాకృత సకలాగమవిలోలినీం ఓంఓం సకలయోగ విభూషిణిం.

ఓంభేంయం సకలభూత ప్రేతపిశాచ బ్రహ్మరాక్షస క్రూరకుత్సిత సర్వ క్రోడవిషదారుణ పరమంత్ర పరయంత్ర పరతంత్రశూన్యప్రయోగో చ్చాటనా తంతువిచ్ఛంతితా పజ్వరానేక కామినీ మోహినీ గ్రహ చపలానేక ఖండిగ్రహ మొండిగ్రహదు గ్రహాదైత్య నీచచోరోన్మ దోద్రేకదుష్ట పరశత్రుగ్రహాణ మేదోమాంస రక్తస్రావ్యజ్వాలా భీం లచక్షుశ్శ్రోత్రజిహ్వా ఘ్రాణమహోగ్రగ్రీవ కరాళదంష్ట్ర వదనవి కారిణీంఓంహ్రూం సకల పరశత్రుమారణిం.

ఓంక్షీం సకలమానవ కంటక భంజితానీయతకృపా కటాక్షవీక్షణ వై భవానంద కందళి తహృదయార విందమందస్మిత వదనారవింద సుం దరీం ఓంశం సకలలోక వశీకరీం.

ఓంహ్రీంశ్రీం శ్రీమదఖండమండల మహాజ్వలిత దీప్తకస్తూరి తిలకలలాట శోభిత విస్తారాఖిల తేజః పుంజభూషిత స్వయందీప్త దిగంతరాళ గీత వాద్యనృత్యగణాచార వీరావేశనిుత కోటేశ్వరవందితం ఓంహ్రీం క్షీంశ్రీం శ్రీకృష్ణా తీరమహాచల పంక్తియోన్మధ్య విజయవాడ పట్టణర క్షక దీక్షాభిరక్షిత మహాచలవశిత శ్రీకనకదుర్గాంబికా న్నమా మ్యహం.

శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

ఆరోగ్యమస్తు.

శ్రీశారదాంబాయైనమః.

శ్రీతుంగమర్తి బుచ్చయార్య సద్గురుయోగీశ్వర దివ్య శ్రీచిర్ణారవిందే భ్యోన్నమః.

శ్రీసీతారామచంద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీరామాయణ సంగ్రహోత్పలమను యుత్పలమాల

౧ శ్రీమదయోధ్యవర్ణన విశేష పటుత్వమహాత్వ మెన్నగా।
౨ శీమలురాజ్యముల్ జనవ శీకరదేశములగ్రహపట్టణ।
౩ స్తోమజమీలు గప్పధన తోయములంగొను రాజధానులా।
౪ భూమికిభూషణంబనగ భూరిప్రశస్త మయోధ్యపట్టణ।
౫ గ్రామమహోస్తలాద్భుత సకారమదింతన నేరనైనయా।
౬ భీమపరాక్రమప్రకట భీషణదర్ప మహోగ్రధీరసం।
౭ గ్రామజయాంచితాంచిత జగాముమనస్థిత కామరాజితో।
౮ స్థామమహాస్త్రశస్త్రసవిధాయక నాయక బాహుశౌర్యదై।
౯ ర్యామహనీయ మంత్రజపయంత్ర క్రియాధనురాదిసాధన।
౧౦ స్తోమవిరోధి శీమవనతోగ్రమహోజ్వలితాగ్ని సంస్థితో।
౧౧ స్థామమహాబలస్ఫుర విధూర్జటితోత్సమ వీరరౌద్రసం।
౧౨ న్నామమహోగ్రద గ్రసవనాయుత ధీకృతశత్రుమారణో।
౧౩ స్థామమహాబలస్ఫుట విదారుణ భీషణదండనాయక।
౧౪ స్తోమకృతాంత వీరభటతోయ సమాకృత సేననాయక।
౧౫ స్తోమప్రధానమంత్రి జనతోత్సవ కట్టడ రాజకీయతో।

౧౬ స్తామకరమ్యహర్మ్యస్తకీ తాన్వితగోపుర శృంగదిక్తటో।
౧౭ ద్దామకరత్నసంఘటిత ధాతుకవాటక స్వర్ణద్వారసం।
౧౮ స్తోమకచిత్రితధ్వజ పతాకస వాహనఛత్రచామర।
౧౯ స్తోమకయాలవట్ట రథతోహిత సస్ఫటపుష్పకాండల।
౨౦ స్తోమవిమానదీప్త మణితోరణ కాంచనరంగవల్లిక।
౨౧ స్తోమనవీనమందిర విధోచిత ప్రేంఖణ సత్రశాలకో।
౨౨ ద్దామసభాప్రభాసిత వితానక సద్గృహమంతరాళక।
౨౩ స్తోమమహోద్భుతాకృత హితోద్ధతధీకృత సర్వమంగళా।
౨౪ శీమనివాసభాస ఘనశిష్టప్రవిష్ట విశిష్టనైష్ఠిక।
౨౫ స్తోమసదాద్వరా ధ్వరహితోద్ధర శాస్త్రమహోద్వరీయసం।
౨౬ న్నామగరీయధుర్య హవనాధ్భవనామ్భవనా మహోమ్భతో।
౨౭ ద్దామకవీవ్వరత్నజన తత్వమహాజన పండితార్యసం।
౨౮ ధామప్రశస్త జ్యోతిషవిధాయక సూనృతరాజయోగసం।
౨౯ స్తోమగురూపదేశిక హితోపన యోక్తప్రశిష్య శిష్యక।
౩౦ స్తోమమహాత్వతత్వ విహితోదయమాన సబ్రహ్మనైష్ఠిక।
౩౧ స్తోమవిధాత విధ్వరహితోన్విత కామవికారసూన్యది।
౩౨ ద్యూమసదాభినందిత విభూతియశః పరిపూరసాంద్రహ్మా।
౩౩ ద్యామకవిష్ణుధ్యాన వినయానయసింస్థిత ధ్యానయోగసం।
౩౪ స్తోమశివాంతరంగ విదితోజ్వలమాన సమానయోగవి।
౩౫ ద్యామహిస్వప్రకాశ విషయాదినిరోధిత చిత్ప్రకాశవి।
౩౬ ద్యాకమహాతోమహీయ విజయద్విజితేంద్రియ నిత్యసత్యస్వ।
౩౭ స్తామతవేదబోధిత విధాతసదార్చన దేవభూసుర।
౩౮ స్తోమకబ్రహ్మచర్య విహితోన్నత ధీకృతశైవయోగసు।
౩౯ స్తోమపురప్రవాస బుధతోహిత క్షత్రియవైశ్యశూద్రసం।
౪౦ ధామకపంచమాద్యఖిల ధాత్రిదశాష్ట ఘణస్వజాతకు।
స్థామతసత్కులాచరిత ధర్మవిధోచిత కర్మనైపుణ।

శ్రీరామాయణ సంగ్రహాత్ఫలము.

౪౨ స్తోమతదంగనాసుత హితోపరిమంశిఖ మందిరాశ్రిమ।
౪౩ స్తోముక సోమయాజికని యామకదాన ధురీణధుర్యవి।
౪౪ స్యామక రాజ్యకంకణ జయవ్విజయాంచిత ఋషుంఋషుణాకృత।
౪౫ న్యామక శుద్ధశబ్ద శ్రవణాన్విత తత్సుఖభటదంబక।
౪౬ స్తోమమదేభ ఘోటక హితోద్ధతగోవృష మేషమాహిష।
౪౭ స్తోమతటాకనవ్య వనతోత్ఫలదామక పుష్పవల్లిక।
౪౮ స్తోముకసర్వవాద్య విహితోత్సవమంత్రి ప్రధానసాహితో।
౪౯ ద్యోమమహారఘు వంశజనితోదధి చంద్రనరేంద్ర వైభవో।
౫౦ స్థామముడు పుణ్యుడాదశరథాహ్వయ ధీరమహావిభుండుత।
౫౧ చ్ఛామత్రయద్విశేష ఘనభాసుర సద్గుణశీమకోసల।
౫౨ త్స్మోమను జేంద్రసూతితగ కైకసుమిత్రలనంగ నందును।
౫౩ ద్దామయశోభిరామ ఘనతన్వికివిష్ణువు రాముడైధరన్।
౫౪ ఖామదితీయ కైకకిలభారతుడన్నిజ శంఖహంశతన్।
౫౫ పాములరేడుచక్రమును భామతృతీయ గునాసుమిత్రకున్।
౫౬ ధీమతిలక్ష్మణుండవగ దిగ్విజయోన్నతు శాత్రవోఘ్నుడన్।
౫౭ ప్రేమజనింపబుత్రులయి పెంపునసొంపున చందనప్పుడా।
౫౮ ధీమతికౌశికాహ్వయ విధేయత విద్యలదీరిపూర్ణులై।
౫౯ దాముపనైనయోగ్యతలదాల్చి యధర్వణ వేదరీతిసం।
౬౦ గ్రామపటుత్వ సద్విజయకారణ మంత్రములభ్యసించియా।
౬౧ తోమతితంద్రియాజ్ఞముని తోడనులక్ష్మణుగూడి వేగియా।
౬౨ భూముల జూచుచున్ మునులప్రోత్పుత మంత్రములభ్యసించుచున్।
౬౩ యాముసులిచ్చినట్టి ఘనయస్త్రములన్నియు జకరనాడుచున్।
౬౪ యాముని విందులందమరి యచ్చటి సంగతులంగ్రహించుచున్।
౬౫ యమునియాశ్రమంబుకడ నంజునుత్రోవను రాయినాతిగా।
౬౬ రాముసదాబ్జధూళితయి రాముప్రభావము దెల్పిహల్యయా।
౬౭ భూమిజగంజనంగ మునిభూమికి దోజనియాంగరక్షణో।

౬౮ ద్ధామత రామలక్ష్మణనితాంతశరస్థిత తాటకాంతకో।
౬౯ ద్ద్యామక యాగపాలకని యామకులై మునివెంటమైథిలీ।
౭౦ క్ష్మామనుజేంద్రుశాల్లి వినిచేరిమహద్భుత లీలశంభువిల్।
౭౧ రాముడుమోపిఫెళ్లన విరాముడనక్ ధనుష్ప్రఖండనో।
౭౨ ద్దాముడనక్ వినీతగుణ ధామమహోన్నత శీతనేలియా।
౭౩ ధీమతులైనతమ్ములకు దీర్చివివాహములందు వేడ్కదా।
౭౪ మామగుజనక రాజన్నృపమాన్యుని యానతితత్సమూహముక్।
౭౫ భూమిజతోడుతక్ గదలిభూరిమహా బలదర్పభార్గవో।
౭౬ ద్ద్రాముని శక్తి గైకొనియుతాల్మివహించి య యోధ్యజేరియా।
౭౭ రాముడుపట్టభద్రుడగు రాకటెరింగియు కైకమందరే।
౭౮ చ్ఛామతపూర్వకారణ నిజాంశత దేవహితార్థమోయనక్।
౭౯ యామను జేంద్రుజేరి మునుయాజ్ఞతొసంగిన యావరంబునక్
౮౦ రాములరణ్యవాసిగను రాజుగనాసుతునుండనిమ్మనక్।
౮౧ యామహినాథుడుర్గతను యక్షులనాజ్ఞ విధించనింతయా।
౮౨ రాముడుశీతలక్ష్మణులు గాజ్ఞశిథీకృత మాచరించియా।
౮౩ భూమిననారపుట్టములు బూనిమహా మునివేషధారులు।
౮౪ య్యామునులక్ష్మణుండు తయంబడి జానకివెనక రాముడు।
౮౫ ద్దామకకంటకప్రకటదానవ భూతపిశాచదైత్యసం।
౮౬ ధామకిరాతచోర విషదర్పక దుష్టమహోగ్రవ్యాఘ్రసం।
౮౭ ధామకదండకాటవిత తావిమితక్ నదనద్యశైలత।
౮౮ మ్మాభములజూచుచుక్ మునులపొంతలజేరి ప్రసంగమెన్నుచుక్
౮౯ యామునులిచ్చినట్టి ఫలదామకతోయములంది భక్తుడో।
౯౦ స్సీమతమంత్రయస్త్రముల నేర్చి మహోగ్రతయోగ మార్గులై।
౯౧ తామటుసంచరించుచు హితాహిత ధర్మములంగ్రహించియు
౯౨ ద్దామతకాననాంతరని తాంతవిహారత పాదచారతో।
ద్దామవిరాధక్రూరఖలుదైత్యక బంధసుబాహుబాహులక్।

## శ్రీరామాయణ సంగ్రహాత్మఫలము.

౯౪ రాముడుద్ధృబించి వీరబలరాజిత దీప్తయశః ప్రభానుడై।
౯౫ కామతనొందురక్కసిని ఘ్రాణచవుల్ దునుమాడియత్కృతో।
౯౬ ద్రామఖరాదిదూషణ విదారుణమారణ భీషణుండునై।
౯౭ భూమ్ములజూచుచుఁ జనుచుభూరినిషాదుల నేరిద్రుంచుచుఁ।
౯౮ ధామహిమీరిపంపదరియుంమస చేరితదాశ్రమార్హ్యులై।
౯౯ తామటతండ్రిపోకవిని ధర్మనియామకకర్మ దీర్చియుఁ।
౧౦౦ యామహిమాయలేడిగను వచ్చినరక్కసునుక్కడించియా।
౧౦౧ ఖామగుశీతనచ్చటను బాసిమహోగ్ర పుదుఃఖితానలో।
౧౦౨ ఘ్రామముగప్ప పక్షియనదుఃఖమునొందు జటాయునెందియా।
౧౦౩ ఖామతెరంగెరంగినిజభక్తు జటాయుకు మోక్షమిచ్చియా।
౧౦౪ శాముడుసత్కృపఁ శబరి రాజిల్ప్రబోధిమహాచలాన్వితా।
౧౦౫ ద్యూమినమారుతీ హితవిభూషణ బంధితచేలునక్కజ।
౧౦౬ స్తోమతినెన్నిసౌమ్యులట జూచియుజానకి వంచునెంచియా।
౧౦౭ భూమిజపోబడిందెలసి భూరికృపఁ రవిసూనునేలియా।
౧౦౮ భీమపరాక్రమ ప్రకట భీకర వాలినిసంహరించియా।
౧౦౯ శీమకునక్కజుఁ విభునిచేసియు నంగదునువ్వరాజుగా।
౧౧౦ రాముడుదీర్చియంతదమ రాకయుజానకి క్షేమమారయఁ।
౧౧౧ యామరుతాత్మజుం బనిచియారసివర్తనమంతమక్కట।
౧౧౨ స్తోమముగూడి దాజనియుతోయధి వారిధిగట్టినంతయా।
౧౧౩ భూమిసుభాషు భీషుఘున సీపుణ్యువిభీషణునేలి యక్కజ।
౧౧౪ స్తోమతినబ్ధిదాటి విజితోద్ధతియుద్ధము నాచరించియు।
౧౧౫ ద్రామకరావణాసుర సుతాహిత బంధుప్రధానతధ్వల।
౧౧౬ స్తోమకకుంభకర్ణ వివిహితోన్వితా దానవదైత్యరక్కస।
౧౧౭ స్తోమము నెల్లద్రుంచి విజతోత్సవవైభవ దిగ్విజైభవో।
౧౧౮ ద్రాముడు సర్వశాస్త్రవవి రాముడనఁ మహోదోగ్రభీషణో।
౧౧౯ ద్రాముడురాముడై ప్రబలిధాత్రిజ నగ్నినదీర్చి నేలియా।

# శ్రీరామాయణ సంగ్రహోత్పలము.

౧౨౦ రాముఁడుసత్కృపారస విరాజితుఁడై ఘనతన్ విభీషణున్।
౧౨౧ ధీమతిరాజుగా నచటదీర్చి మహాత్త్యము దెల్పినంతయా।
౧౨౨ భూమిచరోగ్రబంధులగు భూసురదేవతలన్ వదల్చియా
౧౨౩ తోమమునీంద్ర పుష్పకముతో నటమీరియునబ్ధి కానన।
౧౨౪ ద్భూమిచరాచరంబులగు భూరిమహాచల పల్లెపట్టణ।
౧౨౫ గ్రామనదామలంగనుచు కాంతకుజూపుచు ముచ్చటాడుచున్
౧౨౬ తామునయోధ్యజేరి యటతల్లులదమ్ములగూడియిష్టతన్।
౧౨౭ ధీమతిరాజ్యభారమిలదీరి సుఖోన్నతులందుజానకీ।
౧౨౮ రాములుబ్రోచునన్ధన చిరాయుజయోన్నత నిష్టసిద్ధులన్।
౧ శ్రీమదనంతమంగళ విశేషమహాద్భుత మందగల్లనీ
౨ భూమిప్రశస్తమయ్యెనర భూసురకోటయ కావ్యమియ్యెడన్
౩ శ్రీమతుతుంగదుర్తి బుధశేఖరుబుచ్చయయోగి సద్గురు।
౪ స్వామికినర్పణంబుగను శాంభవిశంభుల కర్పితంబుగన్
౫ శ్రీమహనీయమూర్తులకు శేషనగస్థిత శ్రీనివాసుకున్।
౬ ప్రేమనుతత్పితాపితరపైత పితామహతిప్పతాళికిన్।
మామకదైవమూర్తి యగుమాధవుకున్ ధరకర్పితంబుగన్।
౮ యీమహిసాధు సజ్జనులకియ్యది యమృతసారవంతమై।
౯ యీమహిక్రూర దుష్టులకునయ్యది ఘోరవిషానలాస్త్రమై।
౧౦ రాముడుకర్తగాన మరిరక్షిత శిక్షితజేయుదక్షతన్।
౧౧ నీమకథ్యానయోగులకు నియ్యదిమాంత్రిక రాజమోయనన్।
౧౨ రాముకథానుసారమిల రంజిలనుత్పలమాల దీర్చితిన్।

శ్రీతుంగబుచ్చయార్య సద్గురుయోగీశ్వరార్పణమస్తు సర్వం శ్రీజానకీ రామచంద్రపరబ్రహ్మార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

